### హరిజన పాఠశాల

ఇచ్చటి నొక హరిజన పాఠశాలను ౧౩౪౫ ఫసలీలో స్థానిక కార్యకర్తలు స్థాపించిరి. ౧౩౪౬ నుండి నెలకుపదిహేనురూపాయలు ప్రభుత్వము వారు ఇస్తారిగా ఇచ్చుచున్నారు. మిగిలిన ఖర్చులు చందాలవలన వసూలు చేయబడుచున్నవి. ఇట్టి చందాలవలననే పలకలు బలపములు సప్లై అగుచున్నవి. పాఠశాలయిల్లుకు కిరాయలేదు. స్థలము శ్రీయుత వేంకటేశ్వరరావుగారిది. చందాలవలన చిన్నయిల్లు కట్టబడినది. బాలురసంఖ్య ౨౫ అప్పుడు ౧౫గురు హాజరుఅయియుండిరి.

### దుకాణములు

ఇచ్చట వైశ్యులదుకాణములు క్రమముగా తగ్గుచున్నవి. ఇప్పుడు మూడుమాత్రమున్నవట! మహమ్మదీయసోదరుల దుకాణములు సుమారు పదికలవు. కోమట్లదుకాణములకు వంతులు బాకీలేదట! రెండవవారికి లేదట! అసలువంతు లుండవలసిన అవసరమేమి? సర్కారువారి హుకుముల ప్రకారము ఉద్యోగస్థులు వచ్చిచ్చి వస్తువులు కొనవలయును కదా. వంతు లుండవలసిన చో అందరికినుండవలయును. ఈయంశమును తహశ్శీలుదారుగారును ఇతర అధికారులును తెలిసికొని న్యాయము చేయదగినదై యున్నది!

ఈస్థలము జనసంఖ్య సుమారు ౪౫౦౦ ఇచ్చట మిడిలుస్కూలుకలదు. బాలికాపాఠశాల యున్నది.

### మహమ్మదీయ మత ప్రచారము

ఇది ఇచ్చటను చుట్టుపట్టుల గ్రామములందును హెచ్చుగా సాగుచున్నది. ఈ గ్రామములో ౨౦౦మంది హరిజనులను తురకలలో గలిపిరట! నవాబు బహదరుయార్జంగు (జాగీర్దారు) గారు ఈమధ్యవచ్చిరట! హనుమకొండలోని మహమ్మదీయవకీళ్లును, ఉద్యోగస్థులును వారితో వచ్చిబోధించిరట! కాని ౨౦౦మంది క్రొత్త తురకలలో దాదాపుగా అందరును స్వమతమో ఇష్టములేరట! అనగా మరల హిందువులైరి.

హిందూమతస్థులగు శ్రీయుత కేశవరెడ్డిగారి వలన, క్రొత్తతురకలను మరల హిందువులుగాచేసినందున తురకలకు కన్నెర్రగానున్నదట! ఈ రెడ్డిగారు మున్సిఫ్ న్యాయస్థానములో నకలునవీసుగా పనిచేయుచున్నారు. ఆ స్వమతాభిమాన దోషమునకై వీరికి తబాదలా జరుగనున్నదని వదంతి. నకలునవీసుపని తబాదలా చేయదగిన ఉద్యోగము గాదు. కూలిపనివంటిది. ఈమీదు వారి పనివంటిది. ఈ తబాదలా స్వరూపమెట్లుండునో ముందుగాని తెలియదు! ఇది తబాదలాకరమగునో, స్వమతాభిమానముతో పనిచేయుచున్న జాగీరు గారులు కాలేజీప్రొఫెసర్లు వీరివిషయమున నెట్టిచర్య అవలంబింపబడునో చూడవలసియున్నది. మన ప్రభుత్వమువారు మత విషయములందు అందరికిని స్వాతంత్ర్యమిచ్చువారు కనుక వినిన సంగతులు వీరంతు కేయని తోచుచున్నది.

సాయంత్రము అయిదుగంటలవేళ అతిథులను స్థానికమహాశయులు వీడుకొల్పిరి. అధ్యక్ష మహాశయులు పరిజనులతో సహా హరిజన పాఠశాలనుదర్శించి, సంతోషించి మిరాయిలకు మూడురూపాయలు కార్యనిర్వాహకులకిచ్చిరి. తరువాతనందరును మాదిగ గూడెమునకుపోయి వారికష్టముల విచారించిరి. వీరియిబ్బంది కొంతయున్నట్లు తెలిసినది. ఉత్సాహవంతులగు సవర్ణసోదరులు ఈలోపము దీర్చి హరిజన సోదరులయెడ తమకుగల అభిమానమును చూపగలరని తోచుచున్నది

### మరల హనుమకొండ

తిరిగివచ్చుచు అధ్యక్షమహాశయుల పరిజనసహితముగా, స్థాయిసంఘ ఉపాధ్యక్షులగు శ్రీయుత మాదిరాజు రామకోటేశ్వరరావుగారి భవనమునకు మరలనొకమారువెళ్లి విచారించిరి వారు ఇంటలేనందున నూటిగా కాజీపేట రైలుస్టేషనుమార్గమున హైదరాబాదునకు వచ్చిరి. రాత్రి పదిగంటలవేళ అయినది.

ఈవిధముగా కరీంనగరుజిల్లా పర్యటనము ౧౯ తేదీన ఆరంభమై ౨౫ తేదీరాత్రి సమాప్తమైనది. అనగా ఏడుదినము లీపర్యటనము సాగినది. నాయకులగువారికి ముందువేసవిలో ఇదిశ్రమకొరకమైనను దీనివలన ఎంతో ప్రబోధమేర్పడినదనుట నిస్సంశయము!

---

## వైదికధర్మప్రచారము

(విలేఖరి)

నల్లగొండ ఆర్యసమాజముయొక్క సప్తమ వార్షికోత్సవము ఈశ్వరసంవత్సర వైశా. శు|| ౧౩ మొదలుండి ౧౫వ తేదిపర్యంతము మహోన్నతముగా జరిగెను.

ప్రథమదివసమున శ్రీమాన్ పండితసోమనాథరాయకవిగారు ఈశ్వరప్రార్థనచేసిరి అనంతరము శ్రీమాన్ పండిత మునీశ్వరదేవసిద్ధాంతశిరోమణిగారు ప్రాచీనభారతదేశస్థితినిగురించి వ్యాఖ్యానించిరి. ఈవ్యాఖ్యానము మిక్కిలి శిక్షాప్రదమైయుండెను. శ్రీమాన్ పండితసోమనాథరావుకవిగారు ఈశ్వరదర్శనమునకు ముఖ్యసాధనములైన అష్టాంగయోగములను తెలుగుభాషలో విపులముగవర్ణించిరి. ఇంతటితో సభముగిసెను.

### రెండవదివస కార్యక్రమము

నేడు ప్రాతఃసమయమున హవన (యజ్ఞ)ము జరిగినపిమ్మట యేడుగురు రెడ్డి [క్షత్రియ] సహోదరులు యజ్ఞోపవీతదీక్షను దీసుకొనిరి.

శ్రీయుత ప్రతాపరెడ్డిగారు,
,, రామచంద్రారెడ్డిగారు,
,, నర్సింహ్మారెడ్డిగారు,
,, రామరెడ్డిగారు,
,, రాఘవరెడ్డిగారు.
,, నత్రాజగారు,
,, రామరెడ్డిగారు ఈవరుసప్రకారము జరిగెను.

పైవారి యజ్ఞోపవీత సంస్కారమయిన పిమ్మట శ్రీమాన్ పండిత సోమనాథరాయకవిగారు యజ్ఞోపవీతముయొక్క మాహాత్మ్యమును గురించి, ఉపదేశించిరి. ఆటుపిమ్మట శ్రీమాన్ పండిత మునీశ్వరదేవగారు వేదోపదేశముచేసిరి, ఈయుపదేశము చాలా మనోహరముగా యుండెను.

సాయంకాలము ప్రసమమున శ్రీమాన్ రఘునాథసింహా (ప్రహ్లోక్య) గారు శిక్షాప్రదమైన సంగీతనైపుణ్యముచే,విచ్చేసియున్న శ్రోతృజనులందరిని ఆనందపరచిరి.

అనంతరము యథావిధిగ శ్రీమాన్ పండిత సోమనాథరావుగారు ఈశ్వరప్రార్థనచేసిరి. తర్వాత శ్రీమాన్ పండిత మునీశ్వరదేవ్ గారు వైదికధర్మమునుగురించుపన్యసించిరి ఆటుపిమ్మట శ్రీమాన్ పండిత సోమనాథరావుగారు పంచపాతకములనుగురించి ఉపదేశించిరి. ఈయుపదేశము చాలా శిక్షాప్రదమైయుండెను, కావున విచ్చేసియున్న జనులందరు ఆత్మానందభరితులైరి. ఇంతటితో నేటిసమావేశము ముగిసెను.

### మూడవదివస కార్యక్రమము

నేడు సాయంకాలము యథావిధి ౫| గంటలనుండి శ్రీమాన్ రఘునాథసింహాలను భజనోపదేశములవారు ౬|| గంటలపర్యంతము ఉత్కృష్టమైన భజనలచేవిచ్చేసియున్న జనులందరిని ఆనందపరచిరి. అనంతరము శ్రీమాన్ పండిత మునీశ్వరదేవ్ గారు ఆర్యసమాజముగానేమియో వ్యాఖ్యానించిరి. తదనంతరము శ్రీమాన్ పండిత భద్రసేన్ సిద్ధాంతభూషణగారు వర్ణాశ్రమ ధర్మమునుగురించి చెప్పుచు అస్పృశ్యతానివారణము శాస్త్రసమ్మతమని, మరియు హరిజనులను మనము దగ్గరతీసికొనకయుండిన చాలాపాపమని చెప్పిరి. ఇట్లు వ్యాఖ్యానములుజరిగినపిమ్మట శ్రీమాన్ మంత్రీచందూలాల్ [రామనంద] కె కోటేశ్వరరావుగారి అనుమతివలన శ్రీమాన్ బి. వెంకట్రామనర్సింహారావుగారు మన మహా నిజాంప్రభువుగారికిని విచ్చేసియున్న పండిత మహానుభావులకు, స్థానికహోదేదార్లకు, ఇతరసమాజ సహాయులకందరికి ధన్యవాదములర్పించిరి. ఇంతటితో వార్షికోత్సవము సమాప్తమయ్యెను. ఈశ్వరునికృపవలన ఉత్సవము సఫలమయ్యెను

---

## సరిహద్దులో పోరాటము

బన్నూ జూన్ ౧

అదాయశాఖమంత్రి మెహర్ చంద్ ఖాన్నా గారు డేరా యిస్మాయిల్ ఖాన్ బన్నూలనుండి ఎత్తుకొనిపోబడిన ఒక బాలికతో ప్రసంగించి, పెషావరుకు వెళ్లిరి-

ఎత్తుకొనిపోయిన బాలికలనందరిని ౨౪ గంటలలో విడిపించనిచో తీవ్రముగా శిక్షించెదము అని కొండజాతివారిని అధికారులు బెదిరించిరి.

బన్నూ, జూన్ ౨ -

టాల్ బ్రిడ్జికు తూర్పున ఉన్న సాల్లావద్ద టోచిటెలు జిర్గాసమావేశము చేసి సంధిప్రయత్నములు జరుపుటకు గురువారమువరకు జరిగినవి. దప జూను ౭వ తేదికి మిరానుషాహాకు ప్రయాణమగును- టోరిఖేలుల నాయకుడు ఖాన్ షాన రమరాన్ షాహాలోనున్న రాజకీయాధికారులను కలిసికొనగా సంధిజరుగుటకు పూర్వమే యెత్తుకొని పోయినవారినందరిని కొండజాతులవారు యిచ్చివేయవలెనని తెలియపరచిరి

ఇదివరకు ఇపీఫకీరు అద్భుతమైన వ్యక్తియనిపించుకొనెనుగాని, ఫకీరు ఇర్సాల్ కోట్ లో గుహను విడచిపెట్టగానే టోరిఖేలులకు యుద్ధమునందభిలాషయే చచ్చిపోయినది

సిమ్లా, జూన్ ౨ —

సింకియాంగులో కొందరు అల్లరిజాతివారివలన కలహము లేర్పడినవని ఖాష్‌గారునుండి వార్తలు తెలియ వచ్చుచున్నవి ఈకలహములవలన ప్రమాదములేదుగాని జనరల్ మహమ్మద్ అనుచరులగు కొందరు టుంగన్ సైనికులు ప్రాతిపట్టణముమీద తిరగబడినట్లు తెలియుచున్నది- ఆ జనరల్ మహమ్మదు నేడు శ్రీనగరు చేరెను.

సిమ్లా జూన్ 3 —

జూన్ ౧,౨ తేదీలలో షింకీవద్దను, యీరియమ్ క్యాంపులోను రక్షక సైన్యములపై తుపాకులు కాల్చబడినవి జూన్ ౨వ తేదీ రజ్మాక్ బ్రిగేడున్ను, ఘారియం క్యాంపులోని వెస్టు ఇండియను ఇన్‌ఫెన్ట్రీ బ్రిగేడున్ను తిరిగి చూచెను కొద్దిగా తుపాకులు కాల్చిరి ప్రమాదము లేమియు లేవు, దక్షిణ వజీరిస్థాన్ లో అంతయు నెమ్మదిగా యున్నది కొన్నిమాకలు అల్లరులు జరుపుచున్నరు యీ ప్రయాణకాలులకు ప్రమాదములుజరిగినవి-

సిమ్లా, జూన్ ౪ —

జూన్ నెల ౨వ తేదినాటి రాత్రి రజ్మాక్ ప్రాంతమందలి చున్నీ టెలిగ్రాఫు స్తంభములు శత్రువులచే నాశనము చేయబడినవి- గేరియం శిబిరమువద్ద అసాద్ ఖేల్ సమీపమునున్న రక్షకుల ఠాణామీదను కొన్నిగుండ్లు కాల్చబడెను. నిన్న పగటివేళలో రజ్మాక్ బ్రిగేడు ఠాణావద్దనుండి వచ్చినదళముతో కూడికలిసి పరిసరప్రాంతములనెల్ల పరీక్షించివచ్చినది ప్రమాదములేవియు సంఘటించలేదు బన్నూజిల్లాలో తేజ గ్రామమువద్ద సరిహద్దు కానిస్టేబిల్లకు చెందిన ఠాణామీదికి శత్రువులు దండెత్తి వచ్చుచుండినట్లు జూన్ ౨వ తేది మధ్యాహ్నము వార్తరాగానే పట్టాలనుండి విమానములనే ఆ ప్రాంతమునకు పెళ్లెను కాని శత్రువుల జాడయే కానగట్టుకుండెను-

మేనెల ౨౨వ తేదిమొదలు ౩౦వ తేదివరకు వజీరిస్థానములో ప్రభుత్వసేవలలో యిరువురు హతులైరి- అరుగురు గాయపడిరి-

## ఆంధ్ర మహాసభలు

ఆంధ్రమహాసభలు జూను ౧౯ ౨౦-౨౧ తేదీలలో [illegible]

## మరట్వాడా వార్తలు

### లింగాయతుల యుద్ధము

బీదరు, తీరు ౨౬

ఈజిల్లాలో చేరిన భాల్కీలో తీరు 3 వ తేదినాడు లింగాయతులలో రెండుపార్టీలవారికి సాయంత్రము ఘోరమైనపోరాటము జరిగినది ఉభయపార్టీలలో చాలామందికి బలముగ గాయములు తగిలి వైద్యశాలయందు చికిత్సపొందుచున్నారు పోలీసువారి ఏర్పాట్లకారణముగ శాంతిఏర్పడినది

తెల్లంగలో బావులలో నీరులేనటులను, మరికి నీరు రుచిగాలేనట్లును, నీటికై చాలా అందోళనపడుచున్నట్లును తెలియుచున్నది

### క్రొత్త రోడ్డు

నాందేడు, తీరు ౨౫

ఈజిల్లా నిర్మాణశాఖమెహతెమీం అగు మిస్టర్ ఆఘాలీన్సగారిని మార్చి వీరిస్థానములో ఖైరొద్దీన్ అహమదుగారిని నియమించిరి

ఈగ్రామమునుండి దేగులూరువరకు క్రొత్తరోడ్డు నిర్మించుటకుగాను ౮౦ వేలరూపాయిలు ప్రభుత్వము వారంగీకరించినట్లును పనికూడా ప్రారంభించినట్లును తెలియుచున్నది ఒక సంవత్సరములోపల పనిముగియును

### బీదులో కలరా

బీదు, ౨౫ తీరు

బీదులో కలరా యింకా తగ్గలేదు కొలనులలో నీరుకూడా చెడిపోయినవి ఈజిల్లాచుట్టుప్రక్కల గ్రామములలోకూడ కలరా వ్యాపించినట్లు తెలియుచున్నది

ఈజిల్లా ప్రధానస్థలమందు రైలుస్టేషనొకటి ఏర్పాటుపబడినది కాని రైలుఎప్పుడువచ్చునాయని ఆతురతపడుచున్నారు

యూనానీదవాఖానాలో తాత్కాలికముగా నియమింపబడిన ఉద్యోగస్థులను తీసివేసినారు పని అధికముగనుండి రాబడి తగ్గిపోయినది

### పూర్ణా ప్రాజెక్టు

పర్భని, తీరు ౨౫

వ్యవసాయాభివృద్ధికొరకై పూర్ణానదియొక్క ప్రాజెక్టునిర్మించుటకు ప్రభుత్వము వారొప్పుకొనినారు. సర్వే ప్రారంభించబడినది సర్వే ముగిసినతర్వాత రాబోవుసంవత్సరమునుండి నిర్మాణకార్యము సాగించునట్లు తెలియుచున్నది

ఈదేజిల్లాలో చేరిన పాతరి నుండి గంగాఖేడువరకు రోడ్డునిర్మించుటకు అనుమతి దొరికినది

## ఆంధ్ర సంస్థానములలో విద్యాహీనత

ప్రస్తుతకాలమునందు నైజాము రాష్ట్రమునందు ఎలుతావులయందు వివిధవిద్యాలయంగరపుట కొరకై శ్రీప్రభుత్వమువారు పలు కష్టనష్టముల జెందియు రాష్ట్రమునందు విద్యాభివృద్ధికై బహుప్రయాసజెందుచు అభివృద్ధిజేయుచుండిరి అట్టి సందర్భమునందని ప్రస్తుతపు ఆలాహజరత్ నవాబుగారు ఎట్టికొరతయులేకుండగా సర్వవిధముల రాష్ట్రీయప్రజలసౌకర్యార్థమై తమయొక్క జీవితమును వ్యయపరచుచుండిరి మరియు వ్యవసాయ విషయమున విరుద్ధవ్యయపరచి కట్టించిన కట్టడములు లోకవిదితమైనవిషయమే! ఆకారణమునుబట్టియే ఇప్పటికిరమారమి ఎన్నివేల కుటుంబములు జీవనాధారము తక్కువగుటంచేసి అన్యదేశములనుంచి యీరాష్ట్రమునకువచ్చి జీవించుచుండిరో యావన్మందికి తెలిసినవిషయమే— ఇకవిద్యవిషయమై—రాష్ట్రమునకుంగల ప్రధానపట్టణమునందు సకలవిద్యలంగరపు కళాశాలలనుపెక్కు నిర్మించియున్నారు— యీరాష్ట్రమునందుగలబాలురేగాక అన్యదేశీయ బాలురు గూడ వివిధవిద్యల నేర్పుకొనుటకునై శ్రమయనక విద్యయిచ్చుచు నేర్పుచున్నవారు వారలకు దగు విధుపాయములను శ్రీశ్రీ ప్రభుత్వమువారే జరుపుచున్నారు ఆదియునుంగాక వారికిలోబడియున్న ప్రతిసంస్థానములలోను ప్రతిజాగీర్లు మొదలైనపట్టణగ్రామములయందు విద్యాభివృద్ధికి మిక్కిలి పాటుపడుచుండిరి మరియు యీరాష్ట్రమునకు దక్షిణదిశగల శ్రీనైజాం ప్రభుత్వమువారికి లోబడియున్నటువంటి ఆంధ్రసంస్థానప్రభువులు చాలామట్టుకు వృథయభాషలు—అనగా [తెలుగువుర్దు] నేర్పింపగలందులకు ప్రతిగ్రామముయందును ఒకప్రాథమికపాఠశాలనుఏర్పరచి తద్ద్వారా విద్యను అభివృద్ధిబరచుచున్నారు—కాని యీప్రాంతమునంగల సమస్థానములలో కొన్ని గ్రామములయందు ఒకసరిఅయినపాఠశాల అయినను సంస్థానాధిపతులయొక్క పోషకత్వము లేకుండుటవల్లనే యన నెట్టిదోఅనే ప్రజలు కూపస్థమండూకములవలె బహుకష్టములకుపాలగుచుతిమయొక్క జీవితచర్యయేతామగన నేరక నిష్ప్రయోజకులై

తమయొక్క ఆయురారోగ్య అభివృద్ధిని గమనించనేరక కోలుపోవుచున్నవారలు యిదిఅంతయు మొత్తమునీద విద్యావిహీనతవల్ల గల్గినలోటుపాటనియే వాసవ్యముకము గానప్రజానాయకులు—దేశోద్ధారకులు—దేశసేవకులు మొదలుగాగలవారందరు యీపరిసర గ్రామములయందు జనసంఖ్యనుబట్టి తగినపాఠశాలను నిర్మించి విద్యావాలరకు అభివృద్ధిబరచుటకునై యీసంస్థానాధీశ్వరుల ప్రోత్సాహమునకు గలందులకు ప్రార్థించుచున్నవాడను

విద్యలేనందున ప్రజలు అనాగరికులై, అజ్ఞానులై ఒహకష్టములకు పాలుగావలసివచ్చును గాన పైతెలిపినపెద్దలు తగుశ్రద్ధవహించి త్వరలోవిద్యాసౌకర్యమును జేకూర్చిన మీకువిధేయుడై సర్వకాలమువిమ్ములను ధ్యానించుచుందురు

మహఘన ప్రభువుగారు సర్వకాలములయందును తోడునీడై వారుసల్పు ప్రజాపరిపాలనావిధానమునకు పరాత్పరుడు చిరాయువు నొసంగుగాత—

ఇట్లు, సర్వజనవిధేయుడు
విద్యాభిలాషి.
కే-వి-యల్-శర్మ ఎర్రం



సమరము జరిగెను

యువప్పటికే, గ్రామస్థులుగుహలలోపోయి దాగుకొందురు తర్వాత మరియొకసారి పెద్దలను ఆకారిపోయినవాటినిమాచిన ద్వేషము కాక మైత్రిక దురవా!" కాబట్టి "సరిహద్దువిధానమును సాంతముమార్చివేయుట సాధ్యముకాదా" యని అనుకొనుచున్నారు

"కొందరు బ్రిటిషుసివిలియనులు ఈఅభిప్రాయమును జాతీయవాదులకంటెఎక్కువపట్టుదలగలిగియున్నారు—భారతదేశము లోచిరకాలము పనిచేసిపోయియుండిన డాక్టర్ ఆల్బర్ట్ స్లేటను గారు అట్టివిచారణ అవసరమనుచున్నారు

స్లేటరు గారిట్లనుచున్నారు "సరిహద్దు యమున ప్రభుత్వవిధానముచే తమ యిష్టముప్రకారము నడిపించుకొనుటకు సైనికాధికారులకు ఎట్టిఆక్షేపణయులేదు కాబట్టి సరిహద్దుతెగ పక్కలనుండుభూములు సైనికులయొక్కయు సైనికాధికారులయొక్కయు తర్ఫీదుకై ఉపయోగించబడుచున్నవి కనుక "సరిహద్దుశాంతింపజేయుటకై" ఎడతెగనియుద్ధము ఇప్పుడున్న సరిహద్దులో శాంతినెలకొనిన వెంటనే ఆసరిహద్దును ఇంకనుపైకిజరుపుట ఇట్లుజరుపుటచే క్రొత్తతెగలువచ్చిచే తిరుగబాటుచేయు నూతనక్రొత్తసరిహద్దులో శాంతినెలకొలుపుటకు యత్నము"

ఈవిధముగ ఎడతెగని సేనలపనిచే బ్రిటిషు పౌరుని పైకూడ పన్నుభారమెక్కువ అగుచున్నదని ఆగ్రంథకర్త ఏకరువుపెట్టుచున్నాడు ఈనిరంతరయుద్ధమువలన బ్రిటిషుపౌరుల ప్రాణములకేకాక భారతదేశప్రజలకుకూడ సరిహద్దులో అలజడిగల్గుచున్నది ఈవిధముగ సిమ్లాలోని సైనికాధికారులకు సంతృప్తిగలిగించుటలేదను ఉద్దేశ్యముతోనే బ్రిటిషు నేషనల్ గవర్నమెంటుపక్షమున లార్డులండన్డర్రీగారు ఆయుధవిసర్జన మహాసభలో విమానములనుండి బాంబులనువేయుటను నిషేధించవలెననుసూచనను త్రోసివేసినది ఉత్పత్తిముగనిల్చెను ఈప్రాంతములో ఆయుధములపోటీయే ఎక్కువైనది అప్పు ఎక్కువచేయబడుచున్నవి— పన్నులెక్కువయగుచున్నవి, నివసామాన్యజనులు తిప్పలుచుకొను విధమున నేర్పవలసివచ్చినది— దీనివల్లనంతయు లాభమెవరికి, ఆయుధాన యుద్ధసామగ్రిని తయారుచేయువారలకే

భారతజాతీయవాదులు శాంతిమార్గములచే సరిహద్దులో శాంతిసాధించవచ్చునని నమ్ముచున్నారుగనుక ఆవిషయము ఎంతవరకుచెల్లునదో అధమపక్షము నిష్పాక్షికముగ విచారణచేయవలెనని ఆగ్రంథకర్త సూచించినాడు సూతనకాబ్యాంగమును అమలుపరచుటకు ముందే ఈవిచారణ జరుగించవలెనని సూచించినాడు

కానిఆవిచారణ ఇంతవరకు జరుగలేదుగదా ఇకముందైనను జరుగునదిసంశయమే!

